# అయ్యదేవర కాళేశ్వరరావు

రచన:

"సంఘమిత్ర"

భువనేశ్వరి సాహిత్య నిలయం

దుర్గయ్యవీధి, అరండల్ పేట, విజయవాడ - 520 002.

అయ్యదేవర కాళేశ్వరరావు
రచన:
సంఘమిత్ర

ప్రచురణ:
1991

వెల: రు. 5-00

ముద్రణ:
బాలాజీ ప్రింటింగ్ ప్రెస్
విజయవాడ - 4.

# అయ్యదేవర కాళేశ్వరరావు

ప్రజాహిత రంగంలో అర్ధశతాబ్దానికి పైగా ప్రముఖ పాత్ర వహించిన నాయకమణి శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావుగారు. స్వాతంత్ర్య సమరయోధుడుగా - విశాలాంధ్రో ద్యమ నిర్మాతలలో ఒకరుగా - సంఘ సంస్కర్తగా ఆయన గావించిన బహుముఖ సేవను తెలుగువారు యింతలో మరచి పోలేరు. ఇంత కాలంపాటు విశిష్టమైన సేవా జీవితాన్ని గడిపినందుననే ఆంధ్రప్రదేశ్ తొలి శాసన సభాపతిగా ఎన్నికైన ఘనత ఆయనకు దక్కింది. రాజకీయ, సాంఘిక సేవకుడుగానే గాక మంచి వక్తగాను, గ్రంథకర్తగాను యశస్సు నార్జించిన కాళేశ్వరరావుగారి జీవిత విశేషాలను తెలుసుకొనడం ఆంధ్రులందరి కర్తవ్యం.

## బాల్యం, విద్యాభ్యాసం

కాశేశ్వరరావుగారు 1881 వ సంవత్సరం జనవరి 22 వ తేదీన కృష్ణాజిల్లాలోని నందిగామ గ్రామంలో జన్మించారు. తండ్రి లక్ష్మయ్యగారు. మునగాల జమీందారు వద్ద మేనేజరుగా పనిచేశారు. తల్లి పేరు వరలక్ష్మమ్మగారు అతిథి సత్కారాలలో ఆమె డొక్కా సీతమ్మగారితో పోల్చ దగిన మహా ఇల్లాలుగా చెప్పుకొనడం కద్దు.

కాశేశ్వరరావుగారి తల్లిదండ్రులకు చాలా మంది సంతానం కలిగినా తుదకు మిగిలినవారు కాశేశ్వరరావు గారొక్కరే. ఈయనను తల్లిదండ్రులు అతి గారాబంతో పెంచారు. నందిగామలో కాశేశ్వరరావుగారు ప్రాథమిక విద్య నభ్యసించారు. వీరి తాతగారు నందిగామకు జమీం దారీకరణంగా పనిచేశారు. అందువల్ల కాశేశ్వరరావు పంతులుగారుకూడా ప్రాథమిక విద్యాభ్యాసానంతరం కరి ణీకపు లెక్కలు నేర్చుకున్నారు. నందిగామలో ఉన్నత పాఠశాల లేనందున అప్పట్లో అంతకంటె ఎక్కువ చదువు కొనడానికి వీలులేక పోయింది కాశేశ్వరరావుగారికి.

ఇలా వుండగా ఆయనకు 14 వ సంవత్సరంలోనే వివాహం జరిగింది. నందిగామ తాలూకాలోని కలవచర్ల గ్రామం కరణంగా వున్న పింగళి వీరభద్రయ్యగారి కుమార్తె దుర్గాంబగారి నిచ్చి వివాహం జరిపించారు. దుర్గాంబగారు మహాసాధ్వి. జాతీయోద్యమంలో పాల్గొన్న సమయంలో కాశేశ్వరరావుగారికి ఆమె చేదోడువాదోడుగా వుండి నిత్యం

దేశసేవలకు అతిథి సత్కారాలు చేసేవారు.

సరే. వివాహం అయిన తర్వాత కాశేశ్వరరావుగారు ఇంగ్లీషు చదువుకొనడంకోసమై బందరు వెళ్ళారు. ఆయన 1894 వ సంవత్సరంలో బందరు నోబుల్ కళాశాలలో ఫర్డుఫారంలో చేరారు. కాని చదువుమీదకంటె ఆటలమీద ఆయనకు ఎక్కువ ఆసక్తి వుండేది. అందుచేత పరీక్షలు వచ్చినప్పుడు ఆ పదిరోజులు మాత్రం స్కూలు పుస్తకాలు చదివేవారుగాని ఇతర సమయాలలో పుస్తకమే ముట్టుకునే వారు కారు. అయినా సహజంగా మంచి తెలివితేటలున్నందున ఆ పదిరోజుల చదువే ఆయనను పరీక్షలో ఉత్తీర్ణుణ్ని చేసేది. ఆయన మేధాశక్తి అద్భుతమైనదని ఆనాటి ఉపాధ్యాయులే ప్రశంసించేవారు. మొత్తంమీద కాశేశ్వరరావుగారి కాలేజీ విద్యాభ్యాసం జయప్రదంగానే సాగింది. 1901 వ సంవత్సరంలో ఆయన బి. ఏ. పరీక్షలో కృతార్థులయ్యారు. ఈ పరీక్షలో ప్యాసయిన తర్వాత ఆయనకు కళాశాలలో సత్ప్రవర్తనకు ప్రతి ఏటా ఇచ్చే యోగ్యతాపత్రం ఆ ఏడాది ఆయనకు లభించింది.

## అధ్యాపక వృత్తి

బి. ఏ. ప్యాసయిన తర్వాత కాశేశ్వరరావు పంతులు గారు నోబుల్ కళాశాలలోనే 1902 వ సంవత్సరములో

అధ్యాపకులుగా నియమించబడ్డారు. ఆ కాలంలో కళాశాలా చార్యులు వేరుగను, హైస్కూలు ఉపాధ్యాయులు వేరుగను లేరు. అందువల్ల ఎఫ్. ఏ. జూనియర్‌లో గ్రీసు చరిత్రను, మెట్రికుల్యేషన్‌లో హిందూదేశ చరిత్రను, ఇంగ్లీషు, తెలుగు భాషాంతరీకరణమును, 4, 5 ఫారాలలో ఆంగ్లం, చరిత్ర, లెక్కలు బోధించేపని ఆయనకు అప్పగించబడింది. ఇదిగాక అయిదవ ఫారంలో "సిటిజన్ ఆఫ్ ఇండియా" (భారతదేశపు పౌరుడు) అన్న గ్రంథాన్ని ఆయన బోధించవలసి వచ్చింది, భారతదేశానికి బ్రిటిషు ప్రభుత్వం మేళ్ళను గురించి తెలప డానికే ఆ పుస్తకం వ్రాయబడింది. కాని కాశేశ్వరరావుగారు ఆ గ్రంథంలో వ్రాయబడినదానికి వ్యతిరేకంగా బ్రిటిషు ప్రభుత్వంవల్ల భారతదేశానికి కలుగుతున్న అరిష్టాలను గురించి విద్యార్థులకు బోధించారు. ఆ ఏడాది పరీక్షలో విద్యార్థులంతా కాశేశ్వరరావుగారు చెప్పిన విధంగానే ఆ ప్రశ్నా పత్రానికి సమాధానాలు వ్రాయడంకూడా జరిగింది. ఈ విషయాన్ని స్వయంగా కాశేశ్వరరావుగారే "నా జీవితకథ-నవ్యాంధ్రం" అన్న తమ పుస్తకంలో పేర్కొన్నారు. దీనినిబట్టి ఆ యుక్త వయస్సులోనే పంతులుగారికి ఎలాంటి స్వయం ప్రభావాలు వుండేవో, ఎంతటి దేశభక్తి తొణికిసలాడేదో గ్రహించవచ్చు.

ఇంతేగాక పంతులుగారు తమ విద్యార్థులకు దేశ

భక్తిని, దైవభక్తిని ప్రబోధించేవారు. అన్ని మతాల పట్ల సమాన గౌరవభావం ఏర్పరచుకోవాలని, మానవులంతా ఒకటేనన్న సమతాభావం అలవరచుకోవాలని కూడా ఆయన విద్యార్థులకు ఉపదేశించేవారు. విద్యార్థులకు తెలియని విషయాలను ఎన్నిసార్లయినా వారికి బోధపడేవరకు చెప్పేవారాయన. అందువల్ల విద్యార్థులకు ఆయనపట్ల గౌరవం, ఆయన వద్ద ఎక్కువగా చనువుకూడావుండేది. చాలా మంది విద్యార్థులు పంతులుగారి ఇంటికి వెళ్ళి తమకు తెలియని పాఠాలు చెప్పించుకునేవారు. అందుకాయన ఎవరివద్ద డబ్బు తీసుకునేవారుకారు. నోబుల్ కళాశాలలో పనిచేసిన రెండు సంవత్సరాల కాలంలోను సమర్థత గల ఉపాధ్యాయుడుగా ఆయన మంచి పేరు సంపాదించుకున్నారు. ఆనాడు కాశేశ్వరరావుగారివద్ద విద్య నభ్యసించినవారిలో ఎంతో మంది నేటికి ప్రముఖ పదవులలోను, ఉద్యోగాలలోను వున్నారు.

ఈ ఉపాధ్యాయ వృత్తి పట్ల కాశేశ్వరరావుగారికి చాలా అభిమానం, గౌరవభావం వున్నాయి. అయితే అంతకంటె ఎక్కువగా కూడా ఆనాటి భారతదేశం బానిసత్వంతో అలమటిస్తున్నందున తాను రాజకీయరంగంలో దుమికి మాతృదేశానికి ఉడతాభక్తిని సేవ చేయాలన్న ఆకాంక్ష ఆయనకు ప్రబలంగా వుండేది. ఒక కళాశాలలో అందులోను మిషనరీ కళాశాలలో ఉపాధ్యాయుడుగా వుంటే రాజకీయాలలో పనిచేసే అవకాశం తనకు వుండబోదని ఆయన గుర్తించారు.

ఇది ఇలా వుండగా కాశేశ్వరరావుగారు పెద్ద లాయరు కావాలన్న కోరిక ఆయన తండ్రిగారికి కూడా వుండేది. పంతులుగారికికూడా యిది సంతోషకారణమైనది. **1904** వ సంవత్సరంలో ఆయన మద్రాసు వెళ్ళి లా కాలేజీలో చేరారు.

ఇక్కడ మరొక ముఖ్య విషయం పేర్కొనాలి. బందరులో వుండగా ప్రముఖ సంఘ సంస్కర్త శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారికి శిష్యుడుకాగల సదవకాశం కాశేశ్వరరావుగారికి లభించింది. అందువల్ల చదువుకునే కాలంనుంచి సంఘ సంస్కరణపట్ల ఆయనకు అభిలాష ఏర్పడింది. ఇదిగాక మద్రాసులో న్యాయవాద పరీక్షకు చదువుతున్న రోజులలో అక్కడ నవయుగ నిర్మాత కందుకూరి వీరేశలింగం పంతులుగారి పరిచయ భాగ్యంకూడా కలిగింది పంతులుగారికి. పంతులుగారు, తరుచుగా వీరేశలింగంపంతులు గారింటికెళ్ళి ఆయనవద్ద అనేక విషయాలు నేర్చుకుంటూ ఉండేవారు. ఇలా ఇతర కార్యకలాపాలపట్ల శ్రద్ధ వహిస్తూనే **1905** సంవత్సరంలో కాశేశ్వరరావుగారు బి.యల్.పరీక్షలో కృతార్థులయ్యారు.

## కాంగ్రెసులో ప్రవేశం

**1905** వ సంవత్సరం భారత జాతీయోద్యమ చరిత్రలో అత్యంత ప్రముఖమైనది. అప్పటి వైస్రాయి లార్డ్

కర్జన్ బెంగాల్ రాష్ట్రాన్ని రెండు భాగాలుగా విభజించ డంతో బెంగాల్ ప్రజలు కోపోద్రిక్తులయ్యారు ఈ విభజనను రద్దుచేయాలని కోరుతూ బ్రహ్మాండమైన ఆందోళన బయలు దేరింది. బెంగాల్ విద్యార్థులుకూడా యీ ఉద్యమంలో ముందంజవేసి విదేశ వస్తు బహిష్కరణకు, స్వదేశవస్తు ప్రోత్సాహానికి తీవ్రమైన ప్రచారం సాగించారు. దేశంలో యింకా చాలా చోట్ల ఈ ఉద్యమం వ్యాపించింది. కాని మద్రాసులోని పెద్దలింకా దానిని పట్టించుకొనలేదు. ఆ స్థితిలో బెంగాల్ విద్యార్థులను అభినందిస్తూ, బెంగాల్ ఉద్యమాన్ని బలపరచడానికి మద్రాసులో ఒక పెద్ద సభ జరపాలని కాశే శ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, గొల్లపూడి సీతా రామశాస్త్రి ప్రభృతులు సంకల్పించారు. వారు తమ అభీష్టాన్ని కొందరు పెద్దలకు తెలియజేసి వారి సహాయ సద్భావాలతో బ్రహ్మాండమైన బహిరంగసభ ఏర్పాటుచేశారు. ఆ సభలో బ్రిటిష్ ప్రభుత్వ విధానాలను తీవ్రంగా ఖండిస్తూ, బెంగాల్‌లో జరుగుతున్న జాతీయోద్యమాన్ని పూర్తిగా బలపరస్తూ, పంతులుగారు గంభీరమైన ఉపన్యాసమిచ్చారు. కాశేశ్వరరావు గారి సూచనపై ఆ సభలో పాల్గొన్న వారందరిచేతను స్వదేశ దీక్ష గైకొనబడింది. ఆనాటినుంచి కాశేశ్వరరావుగారు దృఢ మైన జాతీయవాదిగా తయారయ్యారు. 1905వ సంవత్సరం లోనే ఆయన భారత జాతీయ కాంగ్రెసు మహాసంస్థలో సభ్యు లుగా చేరారు.

## న్యాయవాద వృత్తి

మద్రాసులో బి. యల్. పరీక్షలో ఉత్తీర్ణులైన తర్వాత కాశేశ్వరరావుగారు గుంటూరువెళ్ళి ప్రముఖ న్యాయవాది, రాజకీయ నాయకులు అయిన "దేశభక్త" కొండా వెంకటప్పయ్య పంతులుగారివద్ద కొన్నాళ్ళు అప్రెంటిస్‌గా పని చేశారు. తర్వాత కాశేశ్వరరావుగారు బెజవాడలో ప్రాక్టీసు ప్రారంభించారు. ఆయన ప్రాక్టీసు ప్రారంభించిన కొద్ది రోజులకే ప్రభుత్వోద్యోగంలో చేరవలసిందని ఒక సూచన వచ్చింది. రెవిన్యూశాఖలో మంచి ఉద్యోగం యిప్పిస్తానని, దానిలో చేరవలసిందని కాశేశ్వరరావుగారి స్నేహితులొకరు ఆయనకు సూచించారు. కాని దేశభక్తిపరాయణుడైన ఆయన బ్రిటిషు ప్రభుత్వం క్రింద ఉద్యోగం చేయడానికి యిష్టపడక ఆ సూచనను నిరాకరించారు.

న్యాయవాదిగా వృత్తిని చేపట్టిన కొద్దికాలంలోనే ఆయన మంచి పేరు తెచ్చుకొన్నారు. అప్పటికి బెజవాడ జనాభా 28 వేలు మాత్రం. సబుకోర్టు కూడా లేదు. కాని నందిగామ, తిరువూరు, నూజివీడు, గన్నవరం, బెజవాడ - యీ అయిదు తాలూకాల సివిలు దావాలకు సంబంధించిన మునసబుకోర్టులు. మొదటితరగతి క్రిమినల్ కోర్టులు. రెవిన్యూ కోర్టులు వున్నాయి. ఇటు సివిల్ కేసులలోను, అటు క్రిమినల్ కేసులలోను కూడా పంతులుగారు అద్వితీయమయిన

ప్రతిభను ప్రదర్శించి పనిచేసేవారు. కేసు విషయాన్ని క్షుణ్ణముగా పరిశీలించి దాని మంచి చెడ్డలను ఫలితాన్ని ముందే వూహించగల సునిశిత మేధాశక్తి పంతులుగారిది. అన్యాయంగా వేసే దావాలను ఆయన చేపట్టేవారుకాదు. పోతే ఆయన వకాలత్‌పట్టిన కేసులలో నూటికి 90 గెలుపొందితీరేవి. ఇలా కొంతకాలం జరిగిన తర్వాత 1913వ సంవత్సరంలో, బెజవాడలో సబుకోర్టు ఏర్పాటైనది. నిజానికి ఈ సబుకోర్టు రావడానికికూడా కారకులు ఒక విధంగా కాశేశ్వరరావుగారే. బెజవాడలో సబుకోర్టు స్థాపించడం అవసరమని కాశేశ్వరరావుగారు, రాజగోపాలాచారి తదితర మిత్రులతో కలిసి ఆందోళన సాగించారు. ఆ ఆందోళన ఫలితంగా సబుకోర్టు ఏర్పాటైంది. దానితో ఆయనకు- మరింత పని హెచ్చింది. రాత్రి, పగలు నిర్విరామంగా ఆయన పనిచేసేవారు. రాబడి కూడా విశేషంగా వుండేది. ఇలా సుమారు 15 సంవత్సరాలపాటు ఆయన న్యాయవాదిగా బెజవాడలో ప్రాక్టీసుచేసి 1921 వ సంవత్సరంలో గాంధీమహాత్ముడు ప్రారంభించిన సత్యాగ్రహోద్యమంలో చేరేటప్పుడు ఆ వృత్తికి స్వస్తి చెప్పారు.

కాశేశ్వరరావుపంతులుగారు న్యాయవాద వృత్తికి స్వస్తి చెప్పేనాటికి వారికి బెజవాడలో ఒక మేడ, నందిగా

మలో చిన్నఇల్లు, 127 ఎకరాలభూమి, ఆయన సతీమణికి 16 ఎకరాల పల్లపుభూమి, బెజవాడలో 5,400 చదరపు గజాల స్థలం వున్నది. కాని క్రమంగా యీ ఆస్తిలో చాలా భాగం హరించుకుపోయింది. న్యాయవాదిగా వున్నప్పుడు ఆయన విశేషంగా డబ్బుసంపాదించినా అతిథి సత్కారాలకు, దానధర్మాలకు, ప్రజాహితకార్యక్రమాలకు లెక్కలేకుండా ఖర్చుఅయ్యేది. వృత్తినుంచి విరమించి రాజకీయోద్యమంలో చేరిన తర్వాత యీ ఖర్చులు మరింత పెరిగినవిగాని, తరగ లేదు.

పంతులుగారికి సంతానం లేనందున ఆ దంపతులు తమ దగ్గర బంధువుల కుమారుడైన వెంకట కృష్ణమోహనరావును దత్తత చేసుకున్నారు. తర్వాత పంతులుగారు తమ కుమారుని, కోడలినికూడా ఉన్నత విద్యాభ్యాసానికై అమెరికా పంపించారు. ఈ ఖర్చులన్నిటివల్ల ఆస్తిలో చాలాభాగం తరిగిపోయింది. అయినా పంతులుగారికి జీవితంలో ఆర్థిక సంబంధమైన లోటు ఎన్నడూ రాలేదు. ఆయన అస్తమించే సరికికూడా మంచి ఆస్తే కుమారునికి మిగిలింది.

## ఆంధ్రోద్యమం

బెంగాల్ రాష్ట్రవిభజనకు వ్యతిరేకంగా నడచిన ఉద్యమానికి భాషాప్రయుక్తంగా రాష్ట్రాలు వుండాలన్నది ప్రాతిపదిక. కాంగ్రెసుసంస్థకూడా ఈ సూత్రాన్ని అంగీకరించింది.

ఈ భాషారాష్ట్ర నిర్మాణతత్వం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగావున్న ఆంధ్రజిల్లాలవారిలో బాగా వ్యాపించింది. ఆంధ్రులకు ఉజ్వలమైన గతచరిత్ర వున్నది. ఒకప్పుడు యావద్భారతదేశాన్ని వారు పాలించారు. ఆంధ్ర భాష అమృతతుల్యమైనది. ఆంధ్రప్రజలు మేధాసంపత్తిలోగాని, కష్టపడిపనిచేయడంలోగాని, దేశభక్తిలోగాని ఇతరులెవరికీ తీసిపోరు. పైగా ఆంధ్రప్రాంతం చాలా విస్తీర్ణం కలది. సారవంతమైనది. అలాంటప్పుడు తమకు ప్రత్యేకరాష్ట్రం లేకుండా తాము మద్రాసీలుగా పిలవబడడం ఇక్కడి ప్రజలు చెల్లించే పన్నులతో ఉమ్మడి మద్రాను ప్రభుత్వం దక్షిణాది ప్రాంతాలను అభివృద్ధిపర్మ యీ ప్రాంతంపై శీతకన్ను వేయడం తెలుగువారికి నచ్చలేదు. అంతేగాక స్వతంత్ర భారతం ఏర్పడిన తర్వాత నిసలైన ప్రజారాజ్యం వర్ధిల్లాలంటేశాసననిర్మాణ కార్యకలాపాలు, పరిపాలన మాతృభాషలోనే జరగాలని ఆంధ్రులలో రాజకీయ పరిజ్ఞానం కలవారంతా భావించారు.

ఇందుకు అవసరమయిన కార్యక్రమాన్ని నిర్ణయించి కృషి సాగించడానికై 1913వ సంవత్సరంలో ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో జరిగింది. దానికి "దేశభక్త" కొండా వెంకటప్పయ్యగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు, ఈ ఆహ్వాన సంఘంవారు మహాసభకు విస్తృతమైన ఏర్పాట్లుచేసి, రాష్ట్రం నలుమూలలనుంచి ప్రముఖులను ఆహ్వానించారు. అప్పటికి

ఆంధ్రకాంగ్రెస్ ప్రముఖులలో ఒకరుగావున్న బయ్యా నర సింహేశ్వరశర్మగారు ఆ సభ కధ్యక్షత వహించారు. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, ముట్నూరి కృష్ణా రావు ప్రభృతులతోపాటు పంతులుగారు కూడా ఆ సభలో పాల్గొని ప్రముఖపాత్ర వహించారు. ఆంధ్రోద్యమాన్ని గురించి ప్రజలలో తీవ్రంగా ప్రచారం చేయడానికి చర్యలు తీసికోవా లని ఆ సభలో నిర్ణయించబడింది.

తర్వాత **1914** వ సంవత్సరంలో ద్వితీయ ఆంధ్ర మహాసభ బెజవాడలో జరిగింది. ఆ ఆహ్వాన సంఘానికి పంతులుగారే ప్రధాన కార్యదర్శి. విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు కూడా ఈ మహాసభలో పాల్గొ న్నారు. ప్రతి ఏటా జరిగిన ఆంధ్రమహాసభలలో పంతులు గారు గణనీయమైనపాత్ర వహిస్తూ ఈ వుద్యమాన్ని తీవ్ర తరం చేయడానికి పాటుపడ్డారు.

**1031** వ సంవత్సరంలో గాంధీజీ రెండవ రౌండ్ టేబుల్ మహాసభలో పాల్గొనడానికై లండన్ వెళ్ళాడు. అ సమయములో ఆయన కూడా మహాత్మునికి వీడ్కోలు చెప్పడానికి బొంబాయి వెళ్ళారు. అప్పు డాయన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, ఆంధ్ర రాష్ట్ర విభజన అవశ్యకతను వివరిస్తూ పంతులుగారొక సమగ్ర

మైన నివేదికను రూపొందించి, అప్పుడు గాంధీజీకి సమర్పించారు బ్రిటిషు ప్రభుత్వంతో సంప్రదించి ప్రత్యేకాంధ్ర రాష్ట్రం విభజించబడేటట్లు ప్రయత్నించవలసిందిగా పంతులు గారు గాంధీజీని కోరారు. దానికి మహాత్ముడు చిరునవ్వుతో "అసలు స్వరాజ్యం వస్తేకదా ఆంధ్రరాష్ట్రం రావడానికి, దేశానికి స్వాతంత్ర్యం సిద్ధిస్తే ఆంధ్రరాష్ట్రం ఏర్పడడానికి తప్పకుండా నేను మీకు తోడ్పడగలను" అన్నాడట. తీరా లండన్‌లో గాంధీజీ రాయబారం విఫలమైనది. స్వరాజ్యం లేదు, స్వరాష్ట్రంలేదు.

సరే, 1934 వ సంవత్సరంలో ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ విశాఖపట్నంలో జరిగింది. దానికి కాశేశ్వర రావు పంతులుగారే అధ్యక్షత వహించారు.

ప్రత్యేకాంధ్రరాష్ట్ర స్థాపనావశ్యకతను గురించిఆయన తన అధ్యక్షోపన్యాసంలో విపులంగా పేర్కొన్నారు. ఆ సమయానికే ఇండియా పరిపాలనా విధానాలలో ప్రవేశ పెట్టదగు సంస్కరణలను గురించిన బిల్లు పార్లమెంటులో చర్చించబడుతున్నది. దానిని గురించి కూడా ఆయన తమ అధ్యక్షోపన్యాసంలో ప్రస్తావించి ప్రభుత్వం తలపెట్టిన సంస్కరణలలో రాష్ట్రీయ స్వపరి పాలనావకాశం లభిస్తే కాంగ్రెసువారు మంత్రివర్గాలను ఏర్పరచాలని సూచించారు. దేశం మొత్తంలో పైసూచన చేసిన మొదటి వ్యక్తి ఆయన. ఆయన సూచనకు ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులు, వి.వి

గిరి ప్రభృతులు హర్షం వెలిబుచ్చారు. అప్పుడు ప్రభుత్వం రూపొందించిన చట్టాన్ని అనుసరించే 1937 వ సంవత్సరంలో మొత్తం రాష్ట్రాలలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు వారు అధిక సంఖ్యలో ఎన్నుకొనబడి మంత్రివర్గాలను నిర్మించారు. పంతులుగారు కూడా ఆ ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి మద్రాసు శాసనసభకు ఎన్నుకోబడ్డారు. రాజగోపాలాచారిగారు ప్రధానిగా మద్రాసు మంత్రివర్గం ఏర్పడింది. దానిలో మన ఆంధ్రుల తరఫున ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు రెవిన్యూ మంత్రిగాను, బెజవాడ గోపాల రెడ్డిగారు స్థానిక స్వపరిపాలనాశాఖామంత్రిగాను నియమించబడ్డారు. ఆయన ప్రభుత్వ ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శిగాను, కాంగ్రెస్ శాసనసభా పక్షానికి చీఫ్‌గాను వున్నారు. ఆ అసెంబ్లీలోనే కాంగ్రెసు సభ్యులుగావున్న కళా వెంకట్రావుగారు ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పరచాలన్న తీర్మానాన్ని కాంగ్రెసు శాసనసభాపక్షంచే ఆమోదింపజేయాలని కోరుతూ ఒక విజ్ఞప్తిని రూపొందించి ఆంధ్రకాంగ్రెసు శాసనసభ్యులందరిచేత దానిపై సంతకాలు చేయించి ఆ విజ్ఞప్తి పత్రాన్ని పార్టీ చీఫ్‌విప్‌గా వున్న ఆయన గారికి అందజేశారు. దానిని పంతులుగారు పార్టీ నాయకుడైన రాజాజీకి అందజేశారు. దానిపై రాజాజీ రాష్ట్ర స్వపరి

పాలన ఏర్పడిన మొదటి శాసనసభలోనే ఈ తీర్మానం తీసుకురావడం బాగావుండదన్న సందేహాన్ని వెలిబుచ్చారు. దానికి కాశేశ్వరరావుగారు సమాధానమిస్తు, ఇప్పటి నుంచి యత్నిస్తే వచ్చే వైస్రాయి ద్వారా ఇండియా స్టేట్ మంత్రి వద్దకు ఈ సమస్యవెళ్ళి. ఆయన అనుమతి లభించడానికి కొన్ని సంవత్సరాలు పట్టగలదని, ఇప్పటి నుంచి ప్రయత్నిస్తే వచ్చే ఎన్నికలనాటికైనా ఆంధ్రరాష్ట్రం రావడానికి అవకాశమేర్పడుతుందని పంతులుగారన్నారు. అప్పుడు రాజాజీ ఆ తీర్మానాన్ని శాసనసభా కాంగ్రెసు పార్టీలో ప్రతిపాదించడానికి పంతులుగారు అనుమతి యిచ్చారు.

మొత్తం మీద ఆ తీర్మానాన్ని శాసనసభ కాంగ్రెసు పార్టీ ఆమోదించింది. తర్వాత అసెంబ్లీలోను, కౌన్సిల్ లోను కూడా ఇది ప్రతిపాదించబడింది. తీర్మానాన్ని రాజాజీ పూర్తిగా బలపరిచారు. ఉభయసభలు కూడా ఏకగ్రీవంగా తీర్మానాన్ని ఆమోదించాయి.

కాని యిక్కడ మరొక చిక్కు సమస్య వచ్చింది. అది మద్రాసు నగరాన్ని గురించినది. మద్రాసు శాసన సభలో పై తీర్మానం ఆమోదించడానికి ముందే ఆంధ్ర మహాసభ మద్రాసులో జరిగింది. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ దాని అధ్యక్షత వహించారు. ఆంధ్రరాష్ట్రానికి మద్రాసు నగరమే రాజధానిగా వుండాలని ఆ సభ తీర్మానిం

చింది. కాని మద్రాసునగరం ఆంధ్రులకు రాజధానిగా వుండడం రాజాజీ కెంతమాత్రం యిష్టంలేదు. ఆంధ్రులు మద్రాసునగరంపై ఆశ వదులుకుని రాజధానిని ఏ బెజవాడ లోనో పెట్టుకునేపక్షంలో తాను గట్టిగా వ్రాసి ఆంధ్ర రాష్ట్రం తెప్పించగలనని చాలాసార్లు కాశేశ్వరరావుగారితో చెప్పినట్టు ఆయనే వెల్లడించారు. అయితే ఆంధ్రరాష్ట్రా నికి మద్రాసునగరమే రాజధానిగా వుండాలన్నది ప్రకాశం, మహర్షి బులుసు సాంబమూర్తి ప్రభృతుల వాదన. కాశేశ్వరరావు, పట్టాభి, కొండా వెంకటప్పయ్య, కాశీనా థుని నాగేశ్వరరావు ప్రభృతులకు మద్రాసే రాజధానిగా వుండాలన్న పట్టుదలలేదు. ఏదో విధంగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని సంపాదించాలన్నదే వీరి ఆశయం. పోతే ఆంధ్రప్రజల అభిప్రాయం మాత్రం మద్రాసు తమకు రావాలన్నదే. అప్పటింకా హైదరాబాదు ఆంధ్రులకు రాజధాని కాగలదని వూహించడానికైనా ఆస్కారంలేదు. సరే, మొత్తంమీద మద్రాసు ఆంధ్రులకు, తమిళులకు సమిష్టి రాజధానిగా వుండాలని ప్రకాశంగారు ప్రతిపాదిం చగా ఆమోదించబడింది. మద్రాసు ప్రభుత్వం ఆ తీర్మా నాన్ని ప్రత్యేకాంధ్రరాష్ట్రం కోరే తీర్మానాన్ని ఇండియా మంత్రికి పంపింది. కాని ద్వితీయ ప్రపంచయుద్ధం వచ్చే సూచనలు కానవస్తున్నందున దీనిని గురించి యిప్పట్లో యోచించే అవకాశం లేదని ఇండియా మంత్రి నుంచి జాబు

వచ్చింది. ఇంతలో 1939 వ సంవత్సరంలో రెండవ ప్రపంచ యుద్ధం ముంచుకురావడం, కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామాచేసి బయటకురావడం తటస్థించింది.

ఇది ఇలా వుండగా రాయలసీమలో కొందరు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని వ్యతిరేకించారు. ఆ సమయంలో కాశే శ్వరరావుగారు రాయలసీమ జిల్లాలలో పర్యటించి వారి సందేహాలను నివృత్తి చేయడానికి శక్తికొద్ది పాటుపడ్డారు. కాశేశ్వరరావుగారు, మరికొందరు ఆంధ్ర నాయకులు జరి పిన కృషి వల్లనే సర్కారు, రాయలసీమ వారి మధ్య అభి ప్రాయ భేదాలను తొలగించడానికి ఉద్దేశించిన శ్రీబాగ్ ఒడంబడిక కుదిరింది.

ఇలా కాశేశ్వరరావు పంతులుగారు మొదటి నుంచి ఆంధ్రోద్యమ నిర్మాతలలో ఒకరైన ఆంధ్రరాష్ట్రావత రణకు, తర్వాత ఆంధ్రప్రదేశ్ అవతరణకు విశేషంగా కృషి సాగించారు.

## విజ్ఞానచంద్రికా మండలి

ప్రజలలో జాతీయోద్యమాన్ని బాగా వ్యాపింపజేయ డానికి, వారిలో విజ్ఞాన్ని పెంపొందించడానికి దోహదం చేసే ఉత్తమ గ్రంథాలను ప్రచురించడంకోసం ఒక మండ లిని స్థాపించాలని కాశేశ్వరరావు. గాడిచర్ల హరిసర్వో త్తమరావు, కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతులు సంకల్పిం చారు. విజ్ఞానచంద్రికామండలి అన్న పేరుతో ఒక సంస్థను

నెలకొల్పారు. దానికి కాశీశ్వరరావు, హరిసర్వోత్తమరావు గారలు కార్యదర్శులు. కొమర్రాజు లక్షణరావుగారు దీనికి సంపాదకులు. 1907వ సంవత్సరాంతంలో ఈ గ్రంథమండలి కార్యరూపం దాల్చింది. ఈ గ్రంథమండలి తరఫున చరిత్రాత్మక నవలలు. మహనీయుల జీవితచరిత్రలు, ప్రకృతి శాస్త్ర గ్రంథాలు - మొత్తం నలభై వరకు ప్రచురించబడ్డాయి. మొదట్లో ఆయన గారికి గ్రంథాలు వ్రాయడానికి తగిన తీరిక లేకపోయింది. కాని 1922వ సంవత్సరంలోను, తిరిగి 1930వ సంవత్సరంలోను జైలులో వున్నప్పుడుఆయనకు అక్కడ తీరిక లభించింది. ఆ సమయంలోనే ఆయన "ఫ్రెంచి విప్లవచరిత్ర" "అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్ర" తురుష్క "ప్రజాస్వామిక చరిత్ర" అనే మూడు గ్రంథాలు వ్రాసి విజ్ఞాన చంద్రికా మండలి తరఫున ప్రచురించారు. 1932వ సంవత్సరంలో, కారాగార శిక్షను అనుభవిస్తున్న సమయంలో కాశీశ్వరరావుగారు చైనా జాతీయోద్యమమన్న గ్రంథాన్ని రచించారు. "ఈజిప్టు చరిత్ర" అన్న మరొక పుస్తకాన్ని, "ఉపనిషత్సారాలు" అన్న గ్రంథాన్ని కూడా వ్రాశారు.

పోతే కాశీశ్వరరావుగారు "నా జీవితకథ - నవ్యాంధ్రము" అన్న పేరుతో వ్రాసిన వారి స్వీయకథ కొద్ది సంవత్సరాలక్రితమే ప్రచురింపబడింది. దీనిలో కాశీశ్వరరావుగారి జీవిత చరిత్రకు సంబంధించిన వివరాలేగాక.

జాతీయోద్యమానికి, ఆంధ్రోద్యమానికి సంబంధించిన విశే షాలు కూడా వున్నవి.

గ్రంథాలయోద్యమం

ఆంధ్రదేశంలోని గ్రంథాలయోద్యమంలో కూడా కాశే శ్వరరావు పంతులుగారికి సన్నిహిత సంబంధం వున్నది. ఆంధ్ర ప్రజలలో విజ్ఞానంతోపాటు రాజకీయ చైతన్యం కలి గించడానికై 1911వ సంవత్సరంలో అయ్యంకి వెంకట రమణయ్య, సూరి వెంకటనరసింహశాస్త్రిగార్ల యాజమాన్యం క్రింద గ్రంథాలయోద్యమం ప్రారంభమైనది. 1949వ సంవ త్సరంలో గాంధీజీ ప్రారంభించిన సత్యాగ్రహోద్యమంలో చేరేవరకు పంతులుగారుకూడా దీనిలో ప్రముఖపాత్రను నిర్వ ర్తించారు. వీరందరి కృషిఫలితంగానే బెజవాడలో రామ మోహన గ్రంథాలయం ఏర్పడింది. వీరి కృషి మూలంగానే 1944 వ సంవత్సరంలో బెజవాడలో ప్రప్రథమ ఆంధ్ర గ్రంథాలయ మహాసభ జరిగింది. దానికి చిలకమర్తి లక్ష్మీనర సింహంగారధ్యక్షత వహించారు. అప్పటి నుంచి ఆంధ్రదేశం లోని వివిధ ప్రాంతాలలో జిల్లాస్థాయిలోనూ తాలూకా స్థాయి లోనూ కూడా గ్రంథాలయ మహాసభలు జరుగుతూవచ్చింది. రాష్ట్రంలో ఎక్కడ గ్రంథాలయాలు క్రొత్తగా నెలకొన్నా, వాటి ప్రారంభోత్సవానికి కాశేశ్వరరావు, అయ్యంకి వెంకట రమణయ్య, దంటు సుబ్బావధాని ప్రభృతులను తప్పకుండా

ఆహ్వానించి వారి చేతులమీదుగానే ప్రారంభోత్సవాలు జరి పించేవారు. ఆ సమయానికి హోంరూలు ఉద్యమం సాగు తున్నందున పంతులుగారు యెక్కడికి వెళ్ళినా ఏ సభలో పాల్గొన్నా దానిని గురించి ప్రస్తావిస్తూ వుండేవారు.

పోతే పంతులుగారి ఆశీర్వాదబలంవల్ల అభివృద్ధికి వచ్చిన ఇతర సంస్థలను గురించి తెలుసుకుందాము. కాళేశ్వర రావుగారు ఆ రోజులతో సుమారు 40 వేల రూపాయలు విరాళాలు సేకరించి నందిగామలో ఒక ఉన్నత పాఠశాలను, ఒక బాలికా పాఠశాలను నెలకొల్పా చేశారు. 1920 వ సంవ త్సరం వరకు ఆ స్కూళ్ళ నిర్వాహణ సంఘానికి ఆయనే అధ్యక్షుడుగా వుండి వాటినిఅభివృద్ధికి తెచ్చారు. 1921-55 సంవత్సరాల మధ్య బెజవాడలో వేలాది రూపాయలు వసూలు చేసి ఒక జాతీయపాఠశాలను స్థాపించారు. నేడు హరిజన నాయకుడుగా మన్ననలు పొందుతున్న వేముల కూర్మయ్య గారు పంతులుగారింట్లో వుండి ఈ జాతీయ పాఠశాలలో చదువుకుని పైకివచ్చినవారే. పంతులుగారు కొంతకాలంపాటు ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘానికి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. చాల కాలంపాటు ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనే ట్‌లో సభ్యులుఉన్నారు. ఆంధ్రరాష్ట్ర హరిజన సంఘంతో ఆయన శాశ్వత సభ్యుడు. 1926 వ సంవత్సరం నుంచీ 1929 వరకు మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా కూడా వున్నారు. కాని 1930 వ సంవత్సరంలో లాహోర్

కాంగ్రెసు మహాసభ ఆదేశాన్ని పురస్కరించుకొని ఆ పదవికి రాజీనామా యిచ్చారు.

## వరదబాధితులకు సేవ

1916వ సంవత్సరంలో పాతూరు వద్ద కృష్ణానదికి పెద్ద గండిపడింది. అనేక గ్రామాలు జలమయమైనవి. జన నష్టం, పశునష్టం విపరీతంగా సంభవించింది. వందలాది ఇళ్ళు కూలిపోయాయి. వేలాది ప్రజలు నిలువ నీడలేక నిరాశ్రయు లైనారు. హృదయవిదారకమైన యీ దృశ్యం పంతులుగారిని కలిచివేసింది. తన మిత్రులైన అయ్యంకి వెంకటరమణయ్య, దంటు సుబ్బావధాని మొదలైనవారితో కలసి వరదబాధితు లకు సహాయంచేయడానికి నడుంకట్టారు కాశేశ్వరరావుగారు. స్వచ్ఛంద సేవకులను సమీకరించి వారిని జట్టుగా విభజించి ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క జట్టును పంపించారు. కాశే శ్వరరావుగారు బెజవాడలో వరదబాధితుల సహాయార్థం యింటింటికి తిరిగి డబ్బు రూపంలోను, వస్త్రాల రూపంలోను, బియ్యం రూపంలోను ప్రజలవద్దనుంచి సహాయాన్ని సేకరించి దానిని వరదబాధితులకు అందజేశారు. ఆ సమయంలో కాశీ నాధుని నాగేశ్వరరావుపంతులుగారు కూడా తమ 'ఆంధ్ర పత్రిక' ద్వారా సుమారు రెండువేల రూపాయలు విరాళాలను వసూలుచేసి వీరికి పంపించారు. ఇలా సేకరించిన సొమ్ముతో కాశేశ్వరరావుగారు, వారి మిత్రులు వరదబాధితులను కొంత వరకు ఆదుకొనగలిగారు.

## బెజవాడ ఛైర్మన్ పదవి

1925 వ సంవత్సరంనుంచి 1930 వ సంవత్సరం వరకు కాశేశ్వరరావుగారు బెజవాడ పురపాలక సంఘాధ్యక్షులుగా వున్నారు. ఆ రోజులలో కమీషనర్ పదవి లేదు. సర్వాధికారాలు పురపాలక సంఘాధ్యక్షునికే వుండేవి. అందువల్ల బెజవాడ పురపాలక సంఘాన్ని సక్రమంగా నిర్వహించడానికి, పట్టణాన్ని సర్వతోముఖంగా అభివృద్ధిపరచడానికి కాదశ్వరరావుగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవారు. ప్రతిరోజు ఉదయం ఆయన తన కారులో పట్టణమంతా తిరిగి పారిశుధ్యం సరిగా వుందీ లేనిదీ పరిశీలించేవారు. ప్రజల నుంచి వచ్చే దరఖాస్తులను ఆయన ఎప్పటి కప్పుడు చూసి తగు చర్యలు తీసుకునేవారు. ప్రజల దరఖాస్తులేవీ మూడురోజులకు మించి మునిసిపల్ ఆఫీసులో అపరిష్కృతంగా వుండరాదని ఆయన ఉత్తర్వు చేశారుకూడా. ఆఫీసులో పనిచేసే ఉద్యోగులలో కిందినుంచి పైవరకు ప్రతివారు క్రమశిక్షణను పాటిస్తున్నారా లేదా అంశాన్ని ఆయన జాగ్రత్తగా చూసి, తప్పులు చేసినవారిచే నిర్మొహమాటంగా శిక్షించేవారు. దీనికొక చిన్న

**ఉదాహరణ:**

రోడ్లు, కట్టడాలు, నీటివసతి మొదలైనవాటిని అజ్మాయిషీచేసే సూపర్‌వైజర్ శ్రద్ధగా పనిచేయడంలేదని కాశేశ్వరరావుగారు తెలుసుకున్నారు. ఒకనాడు ఆయనను

ఉదయం 8 గంటలకల్లా విద్యుచ్ఛక్తి భవనంవద్దకు రావల సిందని పంతులుగారు ఆదేశించి సరిగా 8 గంటల సమయా నికే ఆయన అక్కడకు చేరుకున్నారు. కాని ఆ సూపర్ వైజర్ 8-30 గంటలకుగాని రాలేదు. దానిపై ఆ సూపర్ వైజర్‌కు పంతులుగారు 15 రూపాయలు జరిమానా విధిం చారు. ఆ సూపర్‌వైజర్ వద్దకు వెళ్ళిన కాగితాలు చాలా రోజులవరకు అపరిష్కృతంగా వుండిపోతున్నవన్న సంగతి తెలుసుకుని ఒకనాడు పంతులుగారు అకస్మాత్తుగా ఆ సూపర్‌వైజర్ డ్రాయర్‌ను తనిఖీ చేశారు. నెలలకొద్దీ అపరిష్కృతంగా నిలిచిపోయిన కాగితాలు దానిలో కనిపించాయి. వెంటనే పంతులుగారు ఆ సూపర్‌వైజర్‌ను సంజాయిషి అడిగి అతడు సంతృప్తికరమైన సమాధానం యివ్వనందున పదిహేనురోజులపాటు సస్పెండు చేశారు. ఒక పెద్ద ఆఫీసరుకు యిలా చురకతగలడంతో కింది ఉద్యోగస్థులంతా భయభక్తులతో పనిచేయనారంభించారు. అలాగే పట్టణంలో ఎక్కడయినా పారిశుధ్యం విషయములో అజాగ్రత్త వున్నట్టు కనిపిస్తే పంతులుగారు శానిటరీ ఇనస్పెక్టర్లకు జరిమానాలు వేసేవారు. ఆ భయంతో వారు కిందివారిచేత శ్రద్ధగా పని చేయించేవారు. ఇలా ప్రతి విషయంలోను పంతులుగారు స్వయంగా శ్రద్ధతీసుకున్న కారణంగా ఆయన హయాములో బెజవాడ మునిసి

పాలిటిలో అవినీతికి, లంచగొండితనానికి దాదాపు ఆస్కారమే లేకుండా పోయింది.

కాగా మునిసిపాలిటీలోని యితర కౌన్సిలర్లు కూడా ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులేనన్న భావముతో పంతులుగారు వారికికూడా కొన్ని బాధ్యతలను అప్పగించేవారు. ముఖ్యంగా ఎవరి వార్డుల పరిస్థితిని వారు శ్రద్ధగా గమనించి ఎక్కడ లోపాలున్నా తనకు తెలియజేయవలసినదని, ఆయా వార్డులలోని ప్రజలకు కావలసిన సౌకర్యాలేమిటో తెలుపవలసిందని ఆయన వారిని కోరేవారు. కాంట్రాక్టుల విషయంలోగాని, ఉద్యోగ నియామకాల విషయంలోగాని న్యాయ సమ్మతమైన పద్ధతి అవలంబించబడేటట్టు పంతులుగారు యత్నించేవారు.

ఇక బెజవాడ పట్టణాన్ని అభివృద్ధిపరచడానికి కాళేశ్వరరావుపంతులుగారు చాలా పథకాలను అమలుపరిచారు. వాటిలో ముఖ్యంగా చెప్పుకోదగినవి విద్యుచ్ఛక్తి సరఫరా, నీటివసతి అభివృద్ధి. పాతపట్టణంలో మురుగు కాల్వల నిర్మాణం, పట్టణంలో గాంధీపార్కును నిర్మించి దానిలో ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పారు. బెజవాడలో మరి అయిదు గ్రంథాలయాలు నెలకొల్పడానికి తాను తోడ్పడి వాటికి గ్రాంట్లు లభింపజేశారు. మునిసిపల్ పాఠశాలలలో జాతీయ కీర్తనలను పాడే ఆచారాన్ని ఆయన ప్రవేశ పెట్టారు. స్కూళ్ళలో రాట్నాలు పెట్టించి నూలు

వడికించే ఏర్పాటుచేశారు. ఇలా వడికిన నూలును అఖిల భారత చరఖా సంఘానికి పంపగా దానిని గాంధీజీ తన "యంగ్ ఇండియా" పత్రికలో ప్రశంసించారు. స్కూళ్ళలో హిందీని ప్రవేశపెట్టారు, ఈ సందర్భంలో బ్రిటిషు ప్రభుత్వంతో ఆయన పోరాడవలసివచ్చింది కూడా. ఆయన ఏనూత్రల వెనుకకు తగ్గలేదు. పోతే సహాయనిరాకరణో ద్యమంలో పాల్గొన్న దేశ భక్తులలో అర్హులైన వారికి పంతులు గారు మునిసిపాలిటీలో ఉద్యోగాలిచ్చారు. పురపాలక సంఘ ప్రాథమిక పాఠశాలలోను, ఉన్నత పాఠశాలలోను ప్రవేశ పెట్టే పాఠ్యగ్రంథాలను కాశేశ్వరరావుగారు ముందుగా చదివి వాటిలో బ్రిటిషు ప్రభుత్వాన్ని పొగుడుతూగాని, ఆ ప్రభుత్వం వల్ల మన దేశానికి కలిగిన లాభాలను, ప్రయోజ నాలను వర్ణిస్తూగాని వ్రాయబడినవాటిని త్రోసిపుచ్చి జాతీయ తత్వాన్ని ప్రభోదించే గ్రంథాలనే ఎన్నిక చేసేవారు.

హరిజన నిధిని పోగుచేసే నిమిత్తం మహాత్ముడు 1929 వ సంవత్సరంలో ఆంధ్రావనిలో పర్యటించాడు. అప్పుడు పంతులుగారు బెజవాడలో ఆ నిధికి 26 వేల రూపా యలు వసూలుచేసి మహాత్మునికి సమర్పించాడు. ఆ సంవత్సరములోనే సైమన్ కమీషన్ బెజవాడమీదుగా మద్రాసు వెళ్ళింది. ఆ సమయంలో కాశేశ్వరరావు గారు తమ పురపాలక సంఘ సమావేశంలో సైమన్ కమీషన్‌ను నిరసిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదింప జేశారు. ఇంతేకాదు, "సైమన్ వెనక్కుపో" అన్న ఆ తీర్మానాన్ని ఆయన

మునిసిపల్ ఖిళ్ళ ధరించిన బంట్రోతుచేత సైమన్ ప్రభువుకు అందజేశారు. అది చదువుకున్న సైమన్ ప్రభువుకు మొహంలో నెత్తురుచుక్క లేకుండాపోయింది. వెంటనే అతడు మండిపడుతూ ప్రక్కనున్న జిల్లా కలెక్టరుకు ఆ కాగితాన్ని యిచ్చాడు. ఆనాడు బెజవాడ స్టేషనులో సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన నల్ల జండాలు ప్రదర్శన జరిగింది. ఇలా పురపాలక సంఘాధ్యక్షులుగా ఒకవైపున పట్టణ సర్వతోముఖాభివృద్ధికి, వేరొక వైపున ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించడానికి ఆయన చేసిన సేవ అనల్పం. అందుకే 1931 వ సంవత్సరంలో తిరిగి ఆయనను అధ్యక్షుడుగా వుండవలసిందని చాలామంది పట్టణప్రముఖులు బలవంతంచేశారు. కాని అందుకు పంతులుగారంగీకరించలేదు. బెజవాడలో పట్టణానికి ఆయన చేసిన సేవకు చిహ్నంగా ఆయన పేరుతో బెజవాడలో బ్రహ్మాండమైన మార్కెట్టు నిర్మించబడింది. 1838వ సంవత్సరంలో పురపాలక సంఘం వారు కాశేశ్వరరావుగారికి ఉచిత పౌరసత్వం కూడా యిచ్చి గౌరవించారు.

## కాంగ్రేసు సేవ

ఇంతవరకు కాశేశ్వరరావు పంతులుగారు ఆంధ్రోద్యమానికి, గ్రంథాలయోద్యమానికి చేసిన సేవను గురించి పురపాలక సంఘాధ్యక్షులుగా బెజవాడ పట్టణానికి చేసిన సేవను గురించి తెలుసుకున్నాము. ఇక కాంగ్రెసులో ఆయన వహించిన పాత్రను మరి కొంత వివరంగా పరిశీలిద్దాము:

1921 వ సంవత్సరంలో న్యాయవాద వృత్తికి స్వస్తి చెప్పిన నాటి నుంచి కాశేశ్వరరావుగారు తమ పూర్తికాలాన్ని కాంగ్రెసు సేవకే వినియోగించసాగారు. 1921 వ సంవత్సరము మార్చి 31 వ తేదీన అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గ సమావేశం బెజవాడలో జరిగింది. దానికి గాంధీజీ, జవహర్ లాల్ నెహ్రూ, దేశబంధు చిత్తరంజన్‌దాస్, డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, సర్దార్ వల్లభాయి పటేల్, మహమ్మదాలీ షౌకత్‌ఆలీ, రాజగోపాలాచారి, మౌలానాఅబ్దుల్ కలాంఆజాద్ డాక్టర్ పట్టాభి సీతారామయ్య, సరోజనీనాయుడు మొదలైన ప్రముఖులంతా హాజరయ్యారు. కార్యవర్గ సమావేశం జరగడానికి వచ్చిన నాయకులకు భోజనవసతి సౌకర్యాలు కలిగించడానికి ఏర్పాట్లు చేయవలసిన భారం కాశేశ్వరరావుగారిపై పడింది. ఇంతటితో పూర్తికాలేదు. అగ్రనాయకులంతా విజయవాడ వస్తున్నారన్న సంగతి తెలియగానే ఆంధ్రదేశం వివిధ ప్రాంతాలనుంచి ఉత్సాహవంతులైన వేలాది ప్రజలు విజయవాడ వచ్చారు. వీరిలో వలంటీరులుగా వచ్చినవారు కూడా చాలామంది వున్నారు. వీరికి కూడా భోజనాది నదుపాయాలు కలిగించవలసి వచ్చింది. పంతులుగారు ఇంత పెద్ద భారాన్ని ఎలా వహించడమన్నా సందేహం పెట్టుకొనకుండా పట్టణ ప్రముఖులవద్ద నుంచి విరాళాలు సేకరించటం ద్వారాను, తన స్వంత డబ్బుతోను కూడా ఈ ఏర్పాట్లన్నిటిని జయప్రదంగా జరిపారు.

అప్పుడు జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో తిలక్ స్వరాజ్యనిధికి కోటి రూపాయలు సేకరించాలని,

దేశంలో 23 లక్షల రాట్నాలు నెలకొల్పాలని తీర్మానించ బడింది. ఈ విధంగా బెజవాడలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశం విజయవంతం కావడానికి కాశేశ్వరరావుగారు కారకులైనారు.

తర్వాత బెజవాడలో కృష్ణానది పుష్కరాలు వచ్చాయి వేలాదిజనం ఆ సమయంలో బెజవాడ వస్తారు. కనుక వారికి కాంగ్రెసు సందేశాన్ని వినిపించడం ప్రయోజనకరమన్న భావంతో ఆయన ఆ పదిహేను రోజులు గాంధీ మైదానంలో కాంగ్రెసు నాయకులు ఉపన్యాసాలను ఏర్పాటు చేశారు.

బ్రిటిషు ప్రభుత్వం కాశేశ్వరరావుగారిని మోదటిసారి 1922 వ సంవత్సరంలో జైలులో వుంచింది. తర్వాత 1930 వ సంవత్సరంలో ఉప్పు సత్యాగ్రహం జరిగింది. ప్రభుత్వం పేదప్రజలకు సయితం నిత్యావసరవస్తువైన ఉప్పుపై పన్ను కొలగించాలని కోరుతూ అందుకోసం గాంధీ మహాత్ముడు సత్యాగ్రహాన్ని ప్రారంభించాడు. అది దేశ మంతా పెద్ద ఉద్యమంగా రూపొందింది లక్షలాది ప్రజలను ఆకర్షించింది. ఆ ఉద్యమంలో అన్ని రాష్ట్రాలతో పాటుఆంధ్రా వని కూడా ముందంజవేసింది. కాకినాడ. కొందరు మొదలైన చోట్ల ఈ ఉప్పు సత్యాగ్రహం అత్యంత జయప్రదంగా సాగింది. ఆ సమయంలో పంతులుగారు కొందరు వలంటీర్లను తీసుకొని బెజవాడ నుంచి బందరు వెళ్ళి స్వయంగా ఉప్పు తయారుచేశారు. అప్పుడు ప్రభుత్వం ఆయనను నిర్బంధించి

ఒక సంవత్సరం జైలు శిక్ష విధించింది. మొదటిసారి అరెస్టు అయినప్పుడు ఆయన కడలూరు జైలులో వున్నారు. ఉప్పు సత్యాగ్రహోద్యమంలో నిర్బంధించినపుడు కొంత కాలం రాజమండ్రి జైలులోను, మరికొంత కాలం తిరుచునాపల్లి జైలులోను, ఇంకొంతకాలం రాయవెల్లూరు జైలులోను వుంచబడ్డారు, తర్వాత 1932వ సంవత్సరంలో ఒకసారి, 1934 వ సంవత్సరంలో మరొకసారి ఆయనకు జైలుశిక్ష విధించబడింది పోతే 1940 వ సంవత్సరంలో తాను వ్యక్తి సత్యాగ్రహం చేయగలనని పంతులుగారు ప్రకటించారు. అప్పుడాయనను ప్రభుత్వం అయిదవసారి అరెస్టుచేసింది, ఇలా వుండగా 1942 వ సంవత్సరపు ఆగస్టు మహోద్యమం సందర్భంలో ఆయన మళ్ళీ నిర్బంధించబడ్డారు. కాని జైలులో ఆయనకు జబ్బు చేసినందున 1944 వ సంవత్సరంలో విడిచిపెట్టారు.

ఇలా జైలు శిక్ష అనుభవించిన కాలాన్ని ఆయనవృధా చేయలేదు. ఆ సమయంలో గ్రంథరచన సాగించడంతోపాటు పెక్కు రాజకీయ గ్రంథాలను ఆయన పరిశీలనాత్మకదృష్టితో చదివారు. కమ్యూనిజంను గురించిన పుస్తకాలన్నిటిని ఆయన పూర్తిగా చదివి మన వాతావరణానికి కమ్యూనిజం సరిపడదన్న నిర్ణయానికి వచ్చారు. ఆసియాలోని వివిధ దేశాల స్వాతంత్ర్య సమరానికి సంబంధించిన గ్రంథాలను రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికాల చరిత్రలను ఆయన ఆ సమయంలోనే పూర్తిగా చదివారు. జైలులో వుండగా పంతులుగారు హిందీ, ఉర్దుభాషలు నేర్చుకున్నారు.

కాశేశ్వరరావు 1917 వ సంవత్సరం నుంచీ అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులుగానే వుంటూ వచ్చారు. అంతేకాక కాంగ్రెసులో ఆయన సుశిక్షితుడైన సైనికుని వలె వ్యవహరిస్తూ అటు అగ్రనాయకుల ఆదరాన్ని, ఇటు ప్రజల ప్రేమాభిమానాలను కూడా చూరగొన్నారు. అందుకే ఆయన ఎన్నిసార్లు ఎన్నికలలో పోటీచేసినా తిరుగు లేకుండా గెలు పొందుతూ వచ్చారు.

స ం ఘ స ం స్క ర ణ లు

ఆయన ప్రముఖ సంఘసంస్కర్త అన్న విషయం మొదట్లోనే పేర్కొనబడింది. బందరులో చదువుకుంటూ ఉండగా పంతులుగారికి రఘుపతి వెంకటరత్నం నాయుడు గారివద్ద శిష్యరికంచేసే సదవకాశం లభించినట్లు కూడా పైన తెలుసుకున్నాము. ఆయనలో మొదటి నుంచిగలసంఘసంస్క రణాభిలాషకు వెంకటరత్నం నాయుడుగారి బోధనలు కార్య రూపం కల్పించాయి. పైగా మద్రాసులో కందుకూరి వీరేశ లింగంపంతులుగారి పరిచయభాగ్యం కలిగింది. వీటన్నిటికి తోడుగా ఆయన కొన్నాళ్ళు పంచముల రాత్రి పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేశారు. సంఘ సంస్కర్తగా పేరు పొందిన ఉన్నవ లక్ష్మీనారాయణగారితో కలిసిపనిచేసే అవ కాశం కూడా పంతులుగారికి కలిగింది.

సంఘ సంస్కరణను గురించి కేవలం వేదికలెక్కి ఉపన్యాసాలిచ్చే యింటిలో ఆ మాటఅయినా రానీయకుండా ప్రవర్తించే తరహాలోనివారుకారు పంతులుగారు. తాను విశ్వసించినవాటి నన్నిటిని ఆయన అక్షరాల అమలులో పెట్టారు. వీరు తమ యింటిలో హరిజనునే సేవకునిగా నియ

మించుకున్నారు. ఇంటిలోని కార్యకలాపాలన్నీ ఆ హరి జనుడే నిర్వర్తించేవాడు. వర్ణాంతర వివాహాలు జరగాలని ఉద్బోధిస్తూ కొంతమందికి తన చేతిమీదుగా అలాంటి వివాహాలు జరిపించారు. పంతులుగారు తమ స్వంత ఖర్చుతో ఒక హరిజన పాఠశాల నెలకొల్పి పెక్కు సంవత్సరాలు దానిని జయప్రదంగా నిర్వహించారు. వీరి కృషివల్లనే 1917 సంవత్సరంలో ప్రథమ ఆదిమాంధ్ర మహాసభ బెజవాడలో జరిగింది.

ఆయన బాల వితంతువివాహాలను, రజస్వలానంతర వివాహాలను, అస్పృశ్యతా నివారణనుబలపరుస్తూ ఆ ఉద్యమా లలో ప్రముఖపాత్ర వహిస్తున్నందుకు ఆనాటి ఛాందస సమాజం కోపించి కొంతకాలం ఆయనను వెలివేసింది. కాని దానిని ఆయన లక్ష్యపెట్టలేదు. పోతే స్త్రీలలో విజ్ఞానాన్ని పెంపొందించి వారిని ఆధునిక కాలానికి తగినట్లు తీర్చిదిద్ద డానికి కూడా పంతులుగారు చాలా శ్రద్ధ తీసుకున్నారు. వీరి కృవల్ల చాలాచోట్ల మహిళా సమాజా లేర్పడ్డాయి. కాగా వరకట్నాల నిషేధానికి ఆయన శాసన సభ్యుడిగావుండి చేసిన కృషి అపారం.

1914 వ సంవత్సరంలో ప్రసిద్ధ సంఘ సంస్కర్త డాక్టర్ కార్వే బెజవాడ వచ్చారు. ఆయన విద్యాధికుడు. పునాలో వితంతు శరణాలయాన్ని, మహిళా విద్యాలయాన్ని నెలకొల్పి ప్రశంసనీయమైన చేసేవచేసి నూరేళ్ళు నిండిన తర్వాత ఇటీవలనే స్వర్గస్థులయ్యారు. ఆయ బెజవాడ రాగానే కాళేశ్వరరావుగారింటికేవెళ్ళి ఆయిదురోజులపాటు ఆయ

నకు అతిథిగా వున్నారు. తాను స్థాపించిన వితంతు శరణా లయం నిర్వహణకు విరాళాలు సేకరించడానికి కార్వే బెజ వాడ వచ్చారు. పంతులుగారు ఈ అవకాశాన్ని వినియో గించుకుని బెజవాడలో వితంతు వివాహ సమస్యపై కార్వే ఉపన్యాసాన్ని ఏర్పాటుచేశారు. ఆ సభకు ఆయనగారే అధ్య క్షత వహించారు కూడా. తర్వాత పూనాలోని వితంతు శర ణాలయం నిమిత్తం కార్వేకు పంతులుగారు స్వతంత్రంగా పెద్ద మొత్తాన్ని విరాళమిచ్చారు ఇంకా పట్టణంలోని కొందరు ప్రముఖులవద్ద నుంచి కూడా విరాళాలు సేకరించి కార్వేకు అందజేశారు. ఇది ఆయన సంఘసంస్కరణాభిలాషకొక చిన్న నిదర్శన మాత్రమే.

పోతే హరిజనులతోను, ఇతర కులస్థులతోను కలిసి సంహపంక్తి భోజనాలు చేయడం మొదటి నుంచి పంతులు గారికి అలవాటే. వారి యింటికి అతి తరుచుగా అటు పూర్వా చారపరాయణులైన బంధువులు, పండితులు మొదలయిన వారు, యిటు సంఘ సేవకులు, రాజకీయ కార్యకర్తలు వంటి వారు వచ్చేవారు. ఆలాంటి పరిస్థితులలో ఆయనగారు సాంఘిక సేవకులతోకలిసి భోజనంచేసేవారు. బంధువులకు, ఆచారపరాయణులయిన యితరులకు వారి సతీమణి లోపల భోజనాది సౌకర్యాలు కలిగించేవారు. అంటే దీనివల్ల వారింటికి ఎలాంటివారు వచ్చినా వారికి లోటుపాట్లు జరిగే అవకాశం వుండేదికాదన్నమాట.

పోతే కళావంతుల సంస్కరణ విషయంలో కూడా ఆయన తీవ్రంగా పాటుపడ్డారు.

భారతదేశంలో ఒక కులంవారు యిలా నీచాతినీచ

మైన వ్యభిచార వృత్తిలో జీవనోపాధి గుడుపుకొనడం అవ మానకరమని పంతులుగారివంటి సంస్కారణాభిలాషులు భావించారు. వ్యభిచార వృత్తినుంచి వారిని తప్పించడానికి, ఆ కులంలోని యుక్తవయస్కులైన స్త్రీలకు వివాహాలు జరిపిం చడానికి, వారికి విద్యాబుద్ధులు నేర్పడానికి తగు ఉద్యమం కొనసాగించాలన్న తలంపు వారికి కలిగింది. ఆయన తదితర సంస్కర్తలు పట్టుదలతో, ఈ కృషిని ప్రారంభించారు. వీరి కృషి ఫలితంగా క్రమంగా కళావంతులలో ముఖ్యంగా ఆ కులంలోని పురుషులలో వివేకోదయం కలిగింది. దానితోవారు తమ పిల్లలకు వివాహాలు చేయడం, విద్యాబుద్ధులు నేర్పించ డం ప్రారంభించారు ప్రజలలో ప్రచారంచేయడంతోపాటు చట్టరీత్యా కూడా ఈ సంస్కారణను అమలులోకి తేవడానికి చాలా పాటుపడ్డారు ఆయన. ఈనాడు యీ కులంలోని వారు సమాజంలో నలుగురితోపాటు తలఎత్తుకు తిరిగి విద్యావంతు లయి ఉన్నత పదవులను అధిష్టించ గలుగుతున్నారంటే దానికి ఆయనవంటి మహనీయుల కృషేనని నిస్సందేహంగా చెప్పవచ్చు.

తెలుగుదేశంలో కందుకూరి వీరేశలింగంపంతులు, రఘు పతి వెంకటరత్నంనాయుడుగారల తర్వాత సంఘ సంస్కారణ కార్యకలాపాలలో పంతులుగారివలె ప్రముఖ పాత్ర వహించిన వ్యక్తులు యించుమించు లేరనే చెప్పవచ్చు.

## స్వ రా జ్య ం - స్వ రా ష్ట్ర ం

వివిధ రంగాలలో ఆయన చేసిన బహుముఖ సేవను గురించి ఇంతవరకు సంగ్రహంగా తెలుసుకున్నాము.

రాజకీయరంగంలో గాంధీజీ నాయకత్వంకింద ఆయన వంటి అకుంఠిత దేశభక్తులు దీర్ఘకాలంపాటు జరిపిన పోరాటం ఫలితంగా భారత ప్రజాకోటిగావించిన అశేష త్యాగాల ఫలితంగాను, 1947 వ సంవత్సరం ఆగస్టు 15వ తేదీతో మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. కొన్ని శతాబ్దాలపాటు మనలను దోచుకుని, రక్త మాంసాలు పీల్చి మన ను పిప్పిచేసిన బ్రిటిషువారు ఆనాటితో మనదేశం నుంచి వెళ్ళిపోయారు. పోతూ పోతూ అఖండభారతంగా అంత వరకు పేరుపొందిన దేశాన్ని రెండు ముక్కలుగా విభజించి వేరే పాకిస్తాన్‌ను ఏర్పాటుచేసి మరీవెళ్ళారు. భారతదేశపు పరిపాలనాధికారం కాంగ్రెస్‌కు అప్పగించబడింది. మన ప్రియతమ నాయకులు జవహర్‌లాల్ నెహ్రూ ప్రధాన మంత్రిగా జాతీయ కేంద్ర ప్రభుత్వం ఏర్పాటైనది. వివిధ రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి.

స్వరాజ్యం సిద్ధించడంతో పంతులుగారి దేశభక్తియుత స్వప్నాలలో ఒకటి ఫలించింది. ఇక ఆంధ్ర నాయకుల స్వప్నాలలో మిగిలినది స్వరాష్ట్రసాధన. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత కాశీశ్వరరావు, ప్రకాశం, పట్టాభి, కళా వెంకట్రావువంటి ప్రముఖ నాయకులు తమ దృష్టిని ఆంధ్రరాష్ట్ర నిర్మాణం వైపు సారించి దీక్షతో పనిచేయ సాగారు. కాని భారత ప్రభుత్వం ఒకపట్టాన సులభంగా యిందుకు సమ్మతించలేదు. దానితో మొదట కొన్నాళ్ళు సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు నిరసనదీక్ష వహించారు. అప్పటికే కేంద్రప్రభుత్వం ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణానికి సుముఖతను తెలపకపోవడంతో పొట్టి శ్రీరా

ములుగారు ఆమరణ నిరాహారదీక్ష సాగించారు. మద్రాసులో 58 రోజులు ప్రత్యేకాంధ్రరాష్ట్ర సాధనకోసం నిరసనదీక్ష వహించిన పిమ్మట ఈ లక్ష్యంకోసం తుదకు ఆయన ఆత్మ బలిదానం చేశారు. ఆ మహామహుని ఆత్మార్పణతో ఆంధ్ర జాతిలో అపూర్వ చైతన్యం కలిగింది. వివిధ ప్రాంతాలలో కనివిని ఎరుగనంత పెద్ద ఉద్యమం కొనసాగింది. ఈ పరిస్థితి గమనించిన ప్రధాని నెహ్రూ ప్రభృతులు ఇక ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని నిర్మించలేకపోతే తెలుగువారు సహించబోరని తెలుసుకొన్నారు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం యివ్వడానికి నెహ్రూ తన సమ్మతిని ప్రకటించారు.

అయితే ఈ దశలో కూడా తిరిగి రాజధాని సమస్య ఉత్పన్నమైనది. ఆంధ్ర నాయకులలోనే ఈవిషయంలో ఏకాభిప్రాయం కుదరలేదు. ఈ ఏకాభిప్రాయాన్ని సాధించడానికి కాశేశ్వరరావుగారు మరికొందరు ప్రముఖులు తీవ్ర కృషి సలిపారు. ఆంధ్రులకు మద్రాసు నగరమే రాజధానిగా ఉండాలన్న పట్టింపు ఆయనకు లేదని మొదట్లోనే తెలుపబడింది. అందని పండుకోసం ఆశపడి చేజిక్కిన అవకాశాన్ని జార విడుచుకోవడం మంచిదికాదని ఆయన వాదం. మొత్తం మీద ఎలాగైతేనేమి కర్నూలు పట్టణం రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలన్న నిర్ణయం జరిగింది. 1953 వ సంవత్సరంలో ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు ఆంధ్రరాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రి అయ్యారు.

ఇంతవరకు బాగానేవుంది. కాని దీనితో ఆయన కల నూటికి నూరుపాళ్ళు ఫలించలేదు. ఆయన ఆశయం ఏదో

విధంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడడంకాదు. తెలంగాణాజిల్లాలతో కలసిన సమగ్రమైన విశాలాంధ్ర ఏర్పడాలన్నదే ఆయన కోరిక. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత ఈ లక్ష్య సాధనకే ఆయన పాటుపడుతూవచ్చారు. ఆయన సంకల్పానికి దైవ బలం తోడ్పడింది. భారత ప్రభుత్వంలో చేరడానికి నిజాం నవాబు నిరాకరించడంతో అప్పుడు కేంద్రంలో ఉపప్రధానిగా వున్న సర్దార్ వల్లభాయి పటేల్ హైదరాబాద్ పైకి భారత సైన్యాలను నడిపించారు. ధైర్యంతో ఆయన తీసుకున్న ఈ సైనిక చర్యవల్ల మూడురోజుల స్వల్పకాలంలో నిజాం నవాబు లొంగిపోయాడు.

ఇది జరిగిన తర్వాత దేశమంతటను భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజించడం సంభవించింది. అప్పుడు ఆయన కలలుకన్నట్టు తెలంగాణాజిల్లాలతో కూడాకలిపి హైదరాబాద్ రాజధానిగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. అంటే పంతులుగారి స్వప్నాలన్నీ నిజమైనవన్నమాట.

శా స న స భా ప తి గా

ఎన్నికలలో నిలబడినప్పుడల్లా విజయవాడ పౌరులు ఆయనను అత్యధిక మెజారిటీతో గెలిపిస్తూనే వచ్చారని పైన పేర్కొనడం జరిగింది. 1955వ సంవత్సరంలో ఆంధ్ర శాసనసభకు జరిగిన ఎన్నికలలో కూడా పంతులుగారు ఎన్నికయ్యారు. సరే, 1957వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడడం, యువనాయకులు నీలం సంజీవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి కావడం తటస్థించింది. అప్పుడేర్పడిన ఆంధ్రప్రదేశ్ తొలి శాసనసభకు స్పీకరుగా ఎన్నుకోబడిన గౌరవం మన కాశేశ్వరరావుగారికి దక్కింది.

అసెంబ్లీ స్పీకరుగా ఆయన శాసనసభలో ఉన్నత ప్రమాణాలను నెలకొల్పారు. తాను కాంగ్రెసు పార్టీకి చెందిన వారైనా కాంగ్రెస్‌పట్ల పక్షపాతం చూపి ప్రతిపక్షాలవారికి అన్యాయంచేసిన సంఘటన ఒక్కటి కూడా ఆయన పదవీ కాలంలో కానరాలేదు. లోపాలు కనిపిస్తే ప్రభుత్వపక్షం వారిని, తుదకు మంత్రులను కూడా మందలించే వారాయన. శాసనసభ్యులు హుందాగా వ్యవహరించి సభాకార్యక్రమాలు జయప్రదంగా కొనసాగడానికి ఎలా తోడ్పడాలో తరచుగా సూచిస్తూ వుండేవారు. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో పంతులు గారు నెలకొల్పిన ప్రమాణాలను పెక్కు రాష్ట్రాలవారు ఆదర్శంగా తీసుకున్నారనడం ఎంతమాత్రం అతిశయోక్తికాదు. అందుకే 1962వ సంవత్సరంలో తొలి శాసనసభ పదవీ కాలం ముగిసినప్పుడు వివిధ పక్షాల శాసనసభ్యులు కూడా స్పీకరుగా కాళేశ్వరరావుగారు అత్యంత ప్రతిభావంతుడని, ఆదర్శప్రాయుడని వేనోళ్ళ ప్రస్తుతించారు. శాసనసభ స్పీకరుగా పనిచేసిన వ్యక్తి యిలా అన్ని పక్షాలవారి ఆదరాన్ని చూరగొనడం సాధారణ విషయంకాదు. ఆ ఘనత పంతులు గారికే దక్కింది.

## అ స్త మ య ం

1962 వ సంవత్సరంలో తిరిగి జనరల్ ఎన్నికలు వచ్చాయి. పంతులుగారు అప్పటికే బాగా వృద్ధులై వుండి కూడా తమ జీవిత శేషాన్ని సయితం ప్రజాసేవకే అర్పించాలన్న సంకల్పంతో విజయవాడ దక్షిణ నియోజకవర్గం నుండి శాసనసభకు పోటీ చేశారు. ఎప్పటి విధంగానే విజయవాడ

పౌరులు ఆయనపట్ల అపారమైన ఆదరాభిమానాలు చూపించి ఆయనను తిరిగి శాసనసభకు ఎన్నుకున్నారు.

కాని...ఏమి లాభం?

ఆ ఓట్ల లెక్కింపురోజు ఉదయమే పంతులుగారు అస్తమించారు. ఆ సాయంత్రానికి ఆయన గెలుపొందినట్లు ప్రకటించబడింది. తాను ఆ ఎన్నికలలో గెలుపొందిన వార్తనైనా వినకుండానే ఆయన కన్నుమూశారు.

కాశేశ్వరరావుగారు నిర్యాణం చెందారన్న వార్త యావదాంధ్రదేశాన్ని విచారసాగరంలో ముంచివేసింది. ఇక విజయవాడ పౌరుల సంతాపానికి మేరలేదు. పోతే కాంగ్రెస్ అగ్రనాయకులంతా కూడా ఆయన అస్తమయానికి విచారం వెలిబుచ్చారు. పవిత్రమైన కృష్ణానదీ తీరాన కాశేశ్వరరావు పంతులుగారికి అంత్యక్రియలు జరిగాయి.

ఆ మహామహుడు నేడు మనమధ్య లేకపోయినా నిష్కళంక దేశభక్తుడుగా-పరువమాన ప్రజాసేవకుడుగా, ప్రముఖ సంఘసంస్కర్తగా ఆయన ఎప్పుడూ ప్రజల హృదయాలలోనే వుండగలరు. ఆయన అన్ని విధాల ధన్యజీవి.